# పంచమోఽధ్యాయః - యాజ్ఞ వల్క్యమహర్షి కృత సరస్వతీ స్తోత్రము

నారాయణ ఉవాచ- నారాయణుడిట్లనెను-

వాగ్దేవతాయాఃస్తవనం శ్రూయతాం సర్వకామదం । మహామునిర్యాజ్ఞావల్క్యో యేన తుష్టావ తాం పురా ॥ 1
గురుశాపాచ్చ స మునిర్హతవిద్యో బభూవ హ । తదాజగామ దుఃఖార్తో రవిస్థానం చ పుణ్యదం ॥ 2
సంప్రాప్య తపసా సూర్యం కోణార్కే దృష్టిగోచరే । తుష్టావ సూర్యం శోకేన రురోద చ పునః పునః ॥ 3
సూర్యస్తం పాఠయామాస వేదవేదాంగమీశ్వరః । ఉవాచ స్తుహి వాగ్దేవీం భక్త్యా చ స్మృతిహేతవే ॥ 4
తమిత్యుక్త్వా దీననాథో హ్యంతర్ధానం జగామ సః । మునిః స్నాత్వా చ తుష్టావ భక్తి నమ్రాత్మ కంధరః॥ 5

నారదా! పూర్వము యాజ్ఞ వల్క్యమహర్షి స్తుతించిన సరస్వతీ దేవతాస్తుతిని వినుము.

గురువుయొక్క శాపమువలన ఆమునియొక్క విద్యలన్నియు నష్టమైపోగా ఆ యాజ్ఞవల్క్యుడు మిక్కిలి దుఃఖముతో రవి దగ్గరకు పోయెను. ఆతడు తపస్సుచేసి దృష్టిగోచరమైన కోణార్కమను స్థానమును చేరి సూర్యదేవతను స్తోత్రము చేయుచు ఏడ్చుచుండెను. భక్తవత్సలుడైన సూర్యుడు యాజ్ఞ వల్క్య మహర్షికి వేద, వేదాంగములు చదివించి స్మృతి ఉండుటకై సరస్వతీ దేవిని భక్తితో స్తోత్రము చేయుమని చెప్పి అంతర్ధానమునందెను. అప్పుడా యాజ్ఞవల్క్య మునీశ్వరుడు స్నానము చేసి భక్తితో సరస్వతీ దేవిని ఇట్లు స్తుతించెను.

యాజ్ఞవల్క్య ఉవాచ- యాజ్ఞవల్క్య మహర్షి ఇట్లనెను-

కృపాంకురు జగన్మాతః మామేవం హతతేజసం । గురుశాపాత్ స్మృతి భ్రష్టం విద్యాహీనం చ దుఃఖితం ॥ 6
జ్ఞానం దేహి స్మృతిందేహి విద్యాం విద్యాధిదేవతే । ప్రతిష్ఠాం కవితాం దేహి శక్తిం శిష్య ప్రబోధికాం ॥ 7
గ్రంథ నిర్మితి శక్తిం చ సచ్ఛిష్యం సుప్రతిష్ఠితం । ప్రతిభాం సత్సభాయాంచ విచారక్షమతాం శుభాం ॥ 8
లుప్తాం సర్వాం దైవవశాన్నవాం కురు పునః పునః । యథాంకురం జనయతి భగవాన్యోగమాయయా ॥ 9
బ్రహ్మ స్వరూపా పరమా జ్యోతిరూపా సనాతనీ । సర్వ విద్యాధిదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥ 10
యయావినా జగత్సర్వం శశ్వజ్జీవన్మృతం సదా । జ్ఞానాధిదేవీ యా తస్యై సరస్వత్యై నమో నమః ॥ 11
యయా వినా జగత్సర్వం మూక మున్మత్తవత్సదా । వాగధిష్ఠాతృదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥ 12

హిమ చందన కుందేందు కుముదాంభోజ సన్నిభా । వర్ణాధి దేవీ యా తస్యై చాక్షరాయై నమో నమః ॥ 13
విసర్గబిందుమాత్రాణాం యదధిష్ఠానమేవచ । ఇత్థం త్వం గీయసే సద్భిః భారత్యై తే నమోనమః ॥ 14
యయా వినాఽత్ర సంఖ్యాకృత్సంఖ్యాం కర్తుం న శక్నుతే । కాల సంఖ్యా స్వరూపా యా తస్యై దేవ్యై నమో నమః ॥ 15
వ్యాఖ్యా స్వరూపా యా దేవీ వ్యాఖ్యాధిష్ఠాతృదేవతా । భ్రమ సిద్ధాంతరూపా యా తస్యై దేవ్యై నమో నమః ॥ 16
స్మృతి శక్తి జ్ఞాన శక్తి బుద్ధిశక్తి స్వరూపిణీ । ప్రతిభా కల్పనాశక్తిర్యా చ తస్యై నమో నమః ॥ 17

జగన్మాతా! ఓ సరస్వతీ! గురు శాపమువల్ల స్మృతి, విద్యాహీనుడనై, దుఃఖములో ఉన్న నాపై దయ చూపుము. ఓ విద్యాధిదేవతా! నాకు జ్ఞానమును, స్మృతిని, విద్యను, ప్రతిష్ఠను, కవితను, శిష్యులకు బోధించు శక్తిని, గ్రంథరచన చేయు శక్తిని, మంచి శిష్యుని, సత్సభలో ప్రతిభను, ఆలోచించు శక్తిని ఇమ్ము. ఇవి అన్నియు నా దురదృష్టమువలన లోపించినవి. భగవంతుడు తన యోగమాయవలన అంకురములను పుట్టించునట్లు నాకు వీనిని తిరిగి ప్రసాదింపుము.

బ్రహ్మస్వరూప, పరంజ్యోతి స్వరూపిణి, సర్వ విద్యాధి దేవత అగువాణీదేవికి నమస్కారము. ఏ సరస్వతీదేవి లేనిచో జగత్తంతయు ఎల్లప్పటికి బ్రతికి యున్నను చనిపోయిన దానితో సమానమగుచున్నదో జ్ఞానాధి దేవతయగు ఆ సరస్వతికి నమస్కారము. ఏ జగన్మాత లేనిచో జగత్తంతయు మూగదానివలె, పిచ్చిదానివలె అగునో వాక్కులకు అధిష్ఠాన దేవతయగు ఆవాణీ దేవికి నమస్కారము. మంచు, చందనము, మల్లెపూవు, చంద్రుడు, కుముదము, తెల్లని పద్మములవలె తెల్లనిది, అక్షరములకు అధిదేవతయగు ఆ అక్షరస్వరూపిణికి నమస్కారము. విసర్గ, బిందువు, మాత్రలకు అధిష్ఠాన దేవతగా సత్పురుషులు కీర్తించు భారతికి నమస్కారము. ఆ దేవత లేనిచో సంఖ్యా గణకుడు లెక్కించలేడో కాల, సంఖ్యా స్వరూపిణి యగు ఆ సరస్వతీ దేవతకు నమస్కారము. వ్యాఖ్యాన స్వరూప, వ్యాఖ్యాధిష్ఠాన దేవత, భ్రమసిద్ధాంత స్వరూపిణి యగు ఆ సరస్వతీ దేవికి నమస్కారము. స్మృతి శక్తి, జ్ఞాన శక్తి, బుద్ధిశక్తి ప్రతిభాశక్తి, కల్పనాశక్తి స్వరూపిణి యగు ఆ దేవతకు నమస్కారము.

సనత్కుమారో బ్రహ్మాణం జ్ఞానం పప్రచ్ఛ యత్రవై । బభూవ జడవత్సోఽపి సిద్ధాంతం కర్తుమక్షమః ॥ 18
తదా జగామ భగవానాత్మా శ్రీకృష్ణ ఈశ్వరః । ఉవాచ సత్తమం స్తోత్రం వాణ్యా ఇతి విధిం తదా ॥ 19
స చ తుష్టావ తాం బ్రహ్మ చాజ్ఞయా పరమాత్మనః । చకార తత్ప్రసాదేన తదా సిద్ధాంతముత్తమం ॥ 20
యదాప్యనంతం పప్రచ్ఛ జ్ఞానమేకం వసుంధరా । బభూవ మూకవత్సోఽపి సిద్ధాంతం కర్తుమక్షమః ॥ 21
తదా త్వాం చ స తుష్టావ సంత్రస్తః కశ్యపాజ్ఞయా । తతశ్చకార సిద్ధాంతం నిర్మలం భ్రమభంజనం ॥ 22
వ్యాసః పురాణ సూత్రం చ సమపృచ్ఛత వాల్మీకిం । మౌనీభూతః స సస్మార త్వామేవ జగదంబికాం ॥ 23
తదా చకార సిద్ధాంతం త్వద్వరేణ మునీశ్వరః । స ప్రాప నిర్మలం జ్ఞానం ప్రమాద ధ్వంస కారణం ॥ 24
పురాణ సూత్రం శ్రుత్వా స వ్యాసః కృష్ణకళోద్భవః । త్వాం సిషేవే చ దధ్యౌ చ శతవర్షం చ పుష్కరే ॥ 25
తదో వేద విభాగం చ పురాణాని చకారహ । యదా మహేంద్రే పప్రచ్ఛ తత్త్వజ్ఞానం శివా శివం ॥ 26
క్షణం త్వామేవ సంచింత్య తస్యై జ్ఞానం దదౌ విభుః । పప్రచ్ఛ శబ్దశాస్త్రం చ మహేంద్రశ్చ బృహస్పతిం ॥ 27
దివ్యం వర్ష సహస్రం చ స త్వాం దధ్యౌ చ పుష్కరే । తదా త్వత్తో వరం ప్రాప్య దివ్యం వర్ష సహస్రకం ॥
ఉవాచ శబ్దశాస్త్రం చ తదర్థం చ సురేశ్వరం ॥ 28
అధ్యాపితాశ్చ యైః శిష్యాః యైరధీతం మునీశ్వరైః । తే చ త్వాం పరిసంచిత్య ప్రవర్తంతే సురేశ్వరి ॥ 29
త్వం సంస్తుతా పూజితా మునీంద్ర మనుమానవైః । దైత్యేంద్రైశ్చ సురైశ్చాపి బ్రహ్మ విష్ణు శివాదిభిః ॥ 30
జడీభూతః సహస్రాస్యః పంచవక్త్రశ్చతుర్ముఖః । యాం స్తోతుం కిమహం స్తౌమి తామేకాస్యేన మానవః ॥ 31

సనత్కుమారుడు బ్రహ్మను జ్ఞానోపదేశమునకై అడుగగా ఆ బ్రహ్మదేవుడు జడునివలె ఏమియు తెల్పలేకపోయెను. అప్పుడు పరమేశ్వరుడగు శ్రీ కృష్ణపరమాత్మ అచ్చటికి వచ్చి సరస్వతీదేవి స్తోత్రమును చేయుమని ఆదేశించెను. ఆ విధముగా శ్రీకృష్ణ పరమాత్మయొక్క ఆజ్ఞననుసరించి బ్రహ్మదేవుడు సరస్వతీదేవిని స్తుతించి ఆమె యొక్క అనుగ్రహము వలన సనత్కుమారునకు జ్ఞానమునుపదేశించెను. అట్లే భూదేవి జ్ఞానోపదేశము చేయమని అనంతుని అడుగగా అతడు మూగవానివలె ఏమియు చెప్పలేని స్థితిలో ఉండగా, కశ్యప మహర్షి యొక్క ఆజ్ఞవలన సరస్వతీ దేవిని స్తుతించి భ్రమభంజకమైన జ్ఞానమును ఉపదేశించెను. అట్లే వ్యాసమహర్షి పురాణములను రచించుపద్ధతిని తెల్పుమని వాల్మీకి మహర్షిని అడుగగా అతడు మౌనము వహించి జగదంబికయైన సరస్వతీ దేవిని స్తుతింపగా ఆమె యొక్క వరమువలన వాల్మీకి మహర్షి నిర్మల జ్ఞానమును పొంది పురాణ సూత్రమును వ్యాసమహర్షికి తెలిపెను. అప్పుడా వ్యాసుడు పుష్కర క్షేత్రమున వంద సంవత్సరములు సరస్వతిని ప్రార్థించి ఆమె యొక్క వరమువలన కవి శ్రేష్ఠుడై, వేదములను విభజించి, పురాణములనన్నిటిని రచించెను. అదేవిధముగా మహేంద్రగిరిపై పార్వతీదేవి పరమేశ్వరుని జ్ఞానోపదేశము చేయుమని కోరగా పరమేశ్వరుడు నిన్ను స్మరించి పార్వతీదేవికి జ్ఞానోపదేశమును చేసెను.

అదేవిధముగా మహేంద్రుడు బృహస్పతిని శబ్దశాస్త్రమును బోధింపుమని కోరగా పుష్కర క్షేత్రమున వేయి సంవత్సరములు నీకై తపమాచరించి నీయొక్క వరము వలన వ్యాకరణ శాస్త్రమును బోధించెను. ఆ తరువాత దేవేంద్రుడు ఆ వ్యాకరణ శాస్త్రమును శిష్యులకు బోధింపగా మునీశ్వరులందరు దానిని అధ్యయమును చేసిరి. వారందరు నిన్ను ధ్యానించిన వారే. (అదే ఐంద్ర వ్యాకరణము)

అట్లే నీవు మునీంద్రులు, మనువులు, మానవులు రాక్షసులు, బ్రహ్మవిష్ణు శివాది దేవతలచే పూజలనందుకొనుచున్నావు. నిన్ను స్తోత్రము చేయుటకు చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు కాని, పంచముఖుడైన పరమేశ్వరుడు కాని, వేయితలలు గల అనంతుడు కాని సమర్థులు కారనినచో ఒకే తల కల మానవుడగు నేను నిన్ను స్తుతింపగలనా?

ఇత్యుక్త్వా యాజ్ఞవల్క్యశ్చ భక్తినమ్రాత్మ కంధరః । ప్రణనామ నిరాహారో రురోద చ ముహుర్ముహుః ॥ 32
తదా జ్యోతిస్వరూపా సా తేనాఽదృష్టాప్యువాచతం । సుకవీంద్రో భవేత్యుక్త్వా వైకుంఠంచ జగామ హ ॥ 33
యాజ్ఞవల్క్యకృతం వాణీస్తోత్రం యః సంయతః పఠేత్ । స కవీంద్రో మహావాగ్మీ బృహస్పతి సమో భవేత్ ॥ 34
మహామూర్ఖశ్చ దుర్మేధా వర్షమేకం చ యః పఠేత్ । స పండితశ్చ మేధావీ సుకవిశ్చ భవేద్ధ్రువం ॥ 35

ఈవిధముగా యాజ్ఞవల్క్యమహర్షి భక్తితో సరస్వతీ దేవిని స్తుతించి నిరాహారుడగుచు నమస్కరించగా జ్యోతి స్వరూపయగు ఆ దేవి దృష్టికి కనిపించకున్నను మంచి కవిశ్రేష్ఠుడవు కమ్మని పలికి నిజనివాసమునకు వెడలిపోయెను.

యాజ్ఞవల్క్య కృతమైన ఈ సరస్వతీ స్తోత్రమును నియమముతో చదువువాడు, కవీంద్రుడు, మంచిమాటకారి, బృహస్పతితో సమానుడు కాగలడు. మహామూర్ఖుడైనను, తెలివి తక్కువ వాడైనను ఒక సంవత్సరము నియమముతో పఠించినచో అతడు గొప్పపండితుడు, మేధావి, కవి కాగలడు.

ఇతి శ్రీ బ్రహ్మ వైవర్తే మహాపురాణే ప్రకృతిఖండే నారద నారాయణ సంవాదే యాజ్ఞవల్క్యోక్తౌ వాణీస్తవనం నామ పంచమోఽధ్యాయః ॥

శ్రీ బ్రహ్మ వైవర్తమమ మహాపురాణములోని ప్రకృతి ఖండమునందున్న నారద నారాయణ సంవాదములో యాజ్ఞవల్క్య మహర్షి చేసిన సరస్వతీదేవీస్తుతి అను

**ఐదవ అధ్యాయము సమాప్తము.**